# సుభాషితరత్నాకరము



ద్వితీయభాగము



ఉభయభాషాప్రవీణ

పింజల సుబ్రహ్మణ్యకవి.

# సుభాషితరత్నాకరము

ద్వితీయభాగము.

( 5 వ తరగతికి )

ఉభయభాషాప్రవీణులును, బెజవాడ పురపాలక

సంఘోన్నత పాఠశాల నాంధ్రోపాధ్యాయులు నగు

శ్రీ పింజల సుబ్రహ్మణ్య కవిగారిచే

రచింపఁబడినది.



బెజవాడ, ఆంధ్రవాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1935

 [మూల్యము రు. **0-3-0.**

# ఆమోదము.



మ॥ మతిమంతుల్ గొనియాడఁగాఁ దగినవాక్చాతుర్యవిస్ఫూర్తిసం
స్కృతమూలంబును జ్ఞప్తిఁ గొలుపు చక్కన్ దెల్గులోఁ జేసి సమ
గ్రతవాటిల్లునటుల్ రచించితివి సుబ్రహ్మణ్య! నీ యీసుభా
షితరత్నాకర మంతరంగమునకుం జేకూర్చు సమ్మోదమున్.

మ॥ స్తుతి కర్హంబగు నీతులుండుట, గుణస్తోమంబు రాణిల్లుటన్
బ్రతిపద్యంబు సమాసయుక్తముగ నుండుటన్ బిన్నలుం బెద్దలున్
సతతంబున్ బఠియింప నొప్పు. వివిధజ్ఞానప్రదంబౌ సుభా
షితరత్నాకర మెల్లకాలమును వ్యాప్తిం గాంచెడుం గావుతన్.

కావ్యకళానిధి, శతావధాని
పిశుపాటి చిదంబరశాస్త్రి.

# FOREWORD.

It is with great pleasure that I write this Foreword to the Gems of Wisdom in Telugu verse, entitled '**Subhashita Ratnakaram.**' The author, **Mr. P. Subrahmanyam**, Ubhayabhasha Praveena, and Additional Telugu Pandit of our High School, deserves every congratulation. He combines, in the work, the experience he has gained as teacher with the Scholarship he has acquired through self-culture. Conceived with forethought and executed in neat and simple style, the books deserve to be placed in the hands of every pupil of the preparatory classes (IV and V) of our Secondary Schools and of Standards III to V of our Elementary Schools.

The easy flow of verse and the aptness of illustration serve to enhance the charm and the usefulness of the books.

I make no doubt that these will gain immense popularity before long, serving as Text-Books to impart moral as well as secular instruction. I wish the author every success.

Municipal High School,
BEZWADA.
6—12—35.

(Sd.) A. GURUMURTI,
B. A., L. T.,
*Head Master.*

# అభిప్రాయములు.

నేను సుభాషితరత్నాకర ప్రథమ ద్వితీయభాగములను జూచితిని. బెజవాడ మ్యునిసిపల్ హైస్కూలు ఆంధ్రపండితులగు ఉభయభాషాప్రవీణ పింజల సుబ్రహ్మణ్య కవిగారిచే మృదుమధుర శైలితో, స్వాభావికమైన కవిత్వధారతో, సులభమైన తేటతెనుఁగు మాటలతో, పామరులకుఁగూడ తెలియు నుదాహరణములతో నీతులు బోధింపబడినవి. ప్రాథమిక పాఠశాలోపాధ్యాయులకు, బాలబాలికలకు మిక్కిలి యుపయోగమైన తరగతిపఠనీయగ్రంథముగా నుండగలదు.

Govt. Training School,
BEZWADA.
6—12—1935.

(Sd.) A. RAMABRAHMAM,
B.A., L.T.,
*Head master.*

సింజల సుబ్రహ్మణ్యకవిగారు తాము రచించిన సుభాషితరత్నాకరము ఒకప్రతి నాకు అందజేసిరి. అక్కడక్కడ కొన్ని పద్యములు చదివియుంటిని. వారును స్వయముగా కొన్ని పద్యములను చదివి వినిపించిరి. చాల శ్రావ్యముగా నున్నవనుటలో సందియములేదు. చిన్ని బాలుర కుపయుక్తములగు ననేక విషయములు చక్కఁగ బోధింపబడినవి. నూతనోపమానములు పెక్కులు గలవు. ప్రాథమికవిద్యాశాలలందును, సెకండరీ స్కూళ్ళలో క్రింది తరగతులకును కడు నుపయోగ మగును.

S.K.P.V.V. Hindu
High School, Bezwada.
9—12—35.

(Sd.) KOTARU RAMA RAO,
M.A., L.T.,
*Head master.*

# సుభాషితరత్నాకరము.

## ద్వితీయభాగము.

### ఉత్తముఁడు

తే॥ గీ॥ ఉత్తమున కెన్ని కష్టంబు ♦ లొదవుచున్న
నీచకార్యంబు లెన్నఁడు ♦ నెరపఁబోఁడు,
సింహ మాఁకలిచేత డ♦స్సినను గూడఁ
దృణమును గ్రసింపఁగోరునే ♦ మనమునందు ?

తే॥ గీ॥ బహుళసంపదలందు నా♦పదలయందు
నొక్కరీతిగనే యుండు ♦ నుత్తముండు
మాన్యుఁడగు సూర్యుఁ డుదయా♦స్తమయములందు
నెఱ్ఱఁగాఁ దోచు టది లోక ♦ మెఱుఁగ దొక్కొ!

తే॥ గీ॥ ఘనుఁడు మిక్కిలిసంపదల్ ♦ గాంచుఁగాక,
తనదు మర్యాద యొక్కింత ♦ దాటఁబోఁడు
జలధి తనలోన నదు లెన్ని ♦ కలియుచున్నఁ
గాంక్ష సేయునె చెలియలి♦కట్ట దాట ?

తే॥ గీ॥ ఎప్పుడు దురాత్ములందుఁ జ♦రింతురుగాక
మాన్యజనులస్వభావంబు ♦ మారఁబోదు,
కాకిమూఁకలోఁ బెరుగును♦గాక మధుర
కూజితంబును వీడునే ♦ కోకిలంబు ?

తే॥ గీ॥ ఆశ్రితున కెన్ని దోషంబు ♦ లమరియున్న
నెంచి యుత్తముఁ డతనిఁ ద్య♦జింపఁబోఁడు
క్షీణతను గళంకంబును ♦ బూనియుండు
చంద్రుని ధరించుచుండఁడే ♦ శంకరుండు!

ఆ॥ వె॥ ధరణి నుత్తముండు ♦ తనచోటుఁ బాసియు
నమితగౌరవంబు ♦ నందఁగలఁడు
జలధిఁ బాసి రత్న♦ములు మహారాజుల
శిరములందుఁ జేరి ♦ మెరయుఁగాదె!

తే॥ గీ॥ అనువులను బాయు సమయంబు♦నందుఁగూడఁ
బావనత్వంబు వీడరు ♦ భవ్యమతులు,
కాల్చివేతురుగాక శం♦ఖంబునందుఁ
గలుగు తెల్లఁదనం బది ♦ తొలఁగి చనునె?

## అధముఁడు

తే॥ గీ॥ అధముఁ డెంతయుఁ గష్టంబు ♦ నందుఁగాక
యధికఫలమును బొందంగ ♦ నర్హుఁ డగునె?
మూఁట లెన్నైన నోర్పుతో ♦ మోయుఁగాక
గాడిదకు మేతదొరకునే ♦ కడుపునిండ?

తే॥ గీ॥ కరుణతోఁ జేయు నయ్యుప♦కారమేని
నీచునకు నపకారమై ♦ నెగడుచుండు
పామునకుఁ గూర్మిమీరంగఁ ♦ బాలుపోయ
నెల్లవేళల విషము వ♦ర్ధిల్లుచుండు.

ఆ॥ వె॥ జన్మభూమి వదలి ♦ చనినంతఁ బెరచోట
నధముఁ డెపుడు బాధ ♦ నందఁగలఁడు
కప్ప చెఱువు వీడి ♦ గట్టుఁజేరిన యంతఁ
గాకవలన బాధఁ ♦ గాంచ కున్నె!

ఆ॥ వె॥ జగతి కెల్ల మేలు ♦ సలుపు నుత్తముఁడేని
యధములకు విరోధి ♦ యగును జుమ్ము,
ఎల్లరకు ముదంబు ♦ నిచ్చెడు చంద్రుఁడే
జారచోరతతికి ♦ శత్రు వగును.

ఆ॥ వె॥ ఎంత గొప్పచోట ♦ నేని యుండునుగాక
యధముఁ డుత్తమత్వ ♦ మందఁబోఁడు
రాజితంబులైన ♦ రాజహర్మ్యములందుఁ
జేరఁగాక కుక్క ♦ సింహ మగునె?

ఆ॥ వె॥ ఎంచి గొప్పచోట ♦ నుంచిన నీచుని
సహజగుణ మొకింత ♦ సడలఁబోదు,
స్వచ్ఛమైన గాంగ ♦ జలములో నుండినం
బంది బురదమీఁది ♦ భ్రాంతి విడునె?

ఉత్తముఁడు — అధముఁడు

ఆ॥ వె॥ ఉత్తముఁడు బ్రకాశ ♦ మొందించు సుగుణంబు
దోషమునె వచించు ♦ దుర్జనుండు,
అవనియందుఁ జంద్రుఁ ♦ డమృతంబు వర్షించు
సర్ప మెప్పుడును వి ♦ షంబు గ్రక్కు.

తే॥ గీ॥ ఉత్తములు మంచిమాటల ♦ నెబ్బుచుంద్రు
నధములు ధనంబుచే మోద ♦ మందుచుందు్రు,
జపముచే దేవతలు సుప్ర♦సన్నులైన
నకట! భూతముల్ బలిచేత ♦ హర్షమొందు.

### మహాత్ముఁడు

ఆ॥ వె॥ పరులదోషములను ♦ బరికించియు మహాత్ము
లంతరంగముననె ♦ యుంతు్రు వాని
కాలకూటమెల్ల ♦ గ్రసియించి, విషమక
శివుఁడు కంఠమందుఁ ♦ జేర్చుకొనఁడె?

ఆ॥ వె॥ అరయ నెట్టి దుష్టు♦లైన మహాత్ముల
చెంతఁ జేరి వారిఁ ♦ జెఱుపలేరు
కంఠసీమయందు ♦ గాలకూటము సేర
శివున కేమియైనఁ ♦ జేటు కలదె?

ఆ॥ వె॥ అల మహాత్ము లాప♦దలఁ బొందుచు నైనఁ
గొందఱకు ముదంబుఁ ♦ గూర్చుచుందు్రు,
చంద్రుఁడుండు క్షయము ♦ నొందుచుండియుఁ గూడ
నమరులకు నొసంగు ♦ నమృతరసము.

తే॥ గీ॥ జగతి నొక్కఁడే మహాత్ముని ♦ శక్తివలన
నన్యుల సమస్తశక్తులు ♦ నడఁగుచుండు
నున్నతంబైన సూర్యతే♦జంబువలనఁ
దారకలకాంతియంతయుఁ ♦ దఱిగిపోదె?

తే॥ గీ॥ ఎంచఁగా నీచుఁడు దిరస్కరించినంత
ధర మహాత్ములమహిమంబు దఱుగఁబోదు
వాయసము నెత్తిపై రెట్టవేయునంత
నేన్గు గొప్పతనంబు క్షీణించు నొక్కొ!

దాత

ఆ॥ వె॥ ప్రాణహాని తనకుఁ బ్రాప్తించినను లోభి
తనముఁ బూనఁబోఁడు దాత యెపుడు
నీరుచల్లినంత నారిపోవునుగాక
యగ్ని చల్లఁదనము నందు నొక్కొ!

ఆ॥ వె॥ సమయ మెఱిఁగి వచ్చు జనునకే ధన మిచ్చు
ననెడువాఁడు దాత యనఁగఁ దగఁడు
కాలమందె ఫలముఁ గాంచఁగల్గిన చెట్టు
కల్పవృక్ష మనెడు ఖ్యాతిఁ గనునె?

తే॥ గీ॥ ఇలను సామాన్యమానవు లెంద ఱున్న
దాతవలె యాచకులనెల్లఁ దనుప లేరు,
ఎంచఁగా నన్యవృక్షంబు లెన్ని యున్న
కామ్యములఁ దీర్చునే కల్పకంబు వోలె?

తే॥ గీ॥ హీనుఁడైనను దాత సేవింప నర్హుఁ
డధికుఁడైనను లోభి యనర్హుఁ డగును
జలముకై చిన్నబావికిఁ జనునుగాని
సంద్రమున కేగునే యెట్టి చవటయైన?

తే॥ గీ॥ ధనము క్షీణించుఁగాక యు♦త్తమజనుండె
యాచకులకోర్కెఁ దీర్పంగ ♦ నర్హుఁ డగును,
ఎండిపోయిన దగుఁగాక ♦ యేరు దాని
యందె జలమునకై త్రవ్వ♦చుందురు జనులు.

లోభి

తే॥ గీ॥ అనుభవింపఁడు ధర్మకా♦ర్యముల కిడఁడు
భక్తితో లోభి ధనముఁ గా♦పాడుచుండు
పైరుపంటల నేవేళఁ ♦ బరులకొఱకుఁ
గష్టపడి కాచుచుండదే ♦ దృష్టిబొమ్మ!

తే॥ గీ॥ ఎంతధన మున్న నరుల ♦ కీయలేని
వాఁడును దరిద్రుఁడే సుమ్ము ♦ వసుధయందు
బహుజలం బుండి యుపయోగ♦పడనికతన
సంద్రమును మరుభూమితో ♦ సాటిగాదె!

ఆ॥ వె॥ ఎంచ లోభిచెంత ♦ నెంతధనం బున్న
సౌఖ్య మున్నె స్వీయ♦జనునకైన
సంద్రమందు నెంత ♦ జల ముండినఁ గళాసు
బయటి నీరుఁ ద్రావి ♦ బ్రదుకవలయు.

ఆ॥ వె॥ ఎపుడు ధర్మములకు ♦ నీయకుండిన లోభి
కెంతధనము గల్గ ♦ నేమి ఫలము?
బిఱ్ఱబిగిసి యున్న ♦ పీనుఁగు మెడ నెన్ని
పూలదండ లిడిన ♦ మేలుగలదె?

ఆ॥ వె॥ మిగుల సిరులతోడ ♦ మెలఁగుచుండియు లోభి
యించుకైన ననుభ♦వింపలేఁడు
గొంతుబంటినీటి ♦ కొలనులో నుండియు
నాకుచుండుఁ గుక్క ♦ నాల్కతోడ.

## సత్సంగము

తే॥ గీ॥ సజ్జనుల చెంత నున్న దు♦ర్జనులకైనఁ
గలుగుచుండును నిరతంబు ♦ గౌరవంబు
విమల మగు లోచనము చెంత ♦ వెలయు కతనఁ
గాంచదే కాటుకను గ్రుడ్డి♦కన్నుగూడ.

తే॥ గీ॥ గొప్పతనమును బొందంగఁ ♦ గోరువార
లెపుడు సుజనులమైత్రిఁ గా♦వింపవలయు
అంద మగు పూలతోఁ జెల్మి ♦ నందుకతన
దారమును స్త్రీలు శిరముపైఁ ♦ దాల్చుచుంద్రు.

ఆ॥ వె॥ అతిప్రకాశవంతుఁ ♦ డగువానిఁ జేరిన
క్షుద్రుఁడేని మిగుల ♦ శోభఁ గాంచు,
సూర్యతేజ మింత ♦ సోఁకిన మాత్రాన
అగ్నికాంతి గలుగు ♦ సద్దమునకు.

ఆ॥ వె॥ గొప్పవారితోడఁ ♦ గూడియుండినమాత్ర
నధముఁడైనఁ బూజ్యుఁ ♦ డగుట నిజము,
శాస్త్రవిదులచేత ♦ స్థాపింపఁబడినంత
రాయి దేవుఁ డగుచు ♦ రాణ కెక్కు.

తే॥ గీ॥ సజ్జనులతోడ స్నేహంబు ♦ సలుపునెడల
నెంత గౌరవమున ల♦భింపఁగలదు
రాఘవునితోడి చెలిమిచేఁ ♦ బ్రాజ్యరాజ్య
విభవమును బొందె మున్ను వి♦భీషణుండు.

ఆ॥ వె॥ తలఁచిచూడ నుత్త♦ములతోడి సాంగత్య
మెల్లరకును గుణంబు ♦ నీయఁగలదు
పద్మపత్రమందుఁ ♦ బడు నీటిబిందువుల్
గాంచ కున్నె మౌక్తి♦కములకాంతి!

ఆ॥ వె॥ సాధుజనులతోడ ♦ సఖ్యంబు గావింప
కుజనుఁడేని మిగుల ♦ సుజనుఁ డగును,
మలయపర్వతంపు ♦ చెలిమి యుండిన వంట
కట్టెలకును మంచి ♦ గంధ మొదవు.

## దుస్సంగము

తే॥ గీ॥ చెడ్డవారల నెపుడేని ♦ చేరినంత
సజ్జనులకును గష్టముల్ ♦ సంభవించు
ఇనుముతోఁ జేరినట్టి కా♦రణమువలన
అగ్ని సమ్మెటపోటుల ♦ నందకున్నె!

ఆ॥ వె॥ క్రూరజనులతోడఁ ♦ గూడ వారిగుణంబు
మంచివారికిని ల♦భించుచుండు
అమృతమయము లైన ♦ యల చంద్రకిరణంబు
లెండలోన వేడి ♦ నెనయుఁ గాదె!

ఆ॥ వె॥ జగతి దుష్టజనుని ♦ సాంగత్యవశమున
సాధువునకు దుర్య♦శంబు గలుగు
కల్లునీటిబొట్టు ♦ కాసంత బడినంత
పంచగవ్యమెల్లఁ ♦ బాడుగాదె!

మహాశ్రయము

తే॥ గీ॥ ప్రభువు వలనను సుకవియుఁ ♦ బ్రభువు సుకవి
వలన సత్కీర్తిఁ గాంతు రి ♦ వ్వసుధయందు,
రాత్రిచేఁ జంద్రుఁడును ♦ రాత్రి చంద్రు
చేతఁ బ్రతిదినమును బ్ర♦కాశించుఁగాదె!

తే॥ గీ॥ పండితుఁడుగాని లతగాని ♦ పడఁతిగాని
యాశ్రయముచేతనే శోభ ♦ నందుచుండు
ఎంత వెలగల మాణిక్య♦మేని మంచి
కనకమునఁ గూర్చినపుడే ప్ర♦కాశమందు.

తే॥ గీ॥ పండితులచెంత నొక్క మూ♦ఢుండు చేర
పండితత్వంబు వాఁడును ♦ బడయఁగలఁడు
ఇలను రోహణశిఖరపై ♦ నిలచినంత
గాజుపూసయు రత్నంపుఁ ♦ గాంతిఁగనదె?

తే॥ గీ॥ అధిక గుణవంతు లగువార♦లైనఁ బరుల
వలననే తమశక్తిని ♦ దెలియఁగలరు
కనుల కెంతటి మహిమంబు ♦ గల్గియున్న
నద్దమే లేనిచోఁ దెలి♦యంగ నగునె?

ఆ॥ వె॥ అతిదురాత్మునకైన • నాశ్రయబలముచే
నధిక గౌరవంబు • నందఁగలఁడు,
స్త్రీల కనులయందుఁ • జేర నల్లనిదైన
కాటుక యను మంచి • కాంతి గలుగు.

ఆ॥ వె॥ నీచజనులకైన • నిర్మలాధారంబు
వలన గొప్పతనము • గలుగుచుండు
పుడమి శుక్తియందుఁ • బడు నీటిబిందువు
ముత్యమై ప్రకాశ•మును వహించు.

హీనాశ్రయము

ఆ॥ వె॥ అల్పుఁడైనవాని • నాశ్రయించుటచేత
ఘనులకైన నింద • గలుగుచుండు
తాడిచెంత పాలు • ద్రావుచుండినఁ గూడఁ
గల్లు ద్రావినట్లు•గాఁ దలంతురు.

ఆ॥ వె॥ అల్పుఁడైన వాని • నాధారముగఁ గొన్న
గొప్పవాఁడుఁ గూడఁ • గొంచెమగును
పెద్ద యేనుఁగూడ • నద్దంబులోపలఁ
గొంచెమగుచుఁ గాను•పించుఁ గాదె!

ఆ॥ వె॥ తెలివిలేని మాన•వుల చెంతఁ జేరిన
గొప్పవారికైనఁ • గొఱంతగలుగు
మందమతికి మంచి • మరకతంబు లభింప
గాజుపెంకులంచు • గలుపకున్నె!

తే॥ గీ॥ ధనముపై నాశచేత దు•ర్జనుని జేరఁ
బలువిధంబులఁ గీడు సం•ప్రాప్తమగును,
రత్నముల కాసఁజెంది సం•ద్రమున మునుఁగ
జలచరంబులచే బాధ • గలుగకున్న !

## విద్య

తే॥ గీ॥ విద్యలందునఁ గడునేర్పు • వెలయవలయు
ఫలము గలుగదు విలువ వ•స్త్రులను దాల్ప
సర్వవిద్యలలో మేటి•చతురుఁ డయ్యు
చర్మములఁ దాల్చి తిరుగఁడే • శంకరుండు ?

తే॥ గీ॥ కష్టకాలంబునందు న•క్కఱకు వచ్చు
విద్యకై యత్నములను గా•వింపఁదగును
పార్థునకు మున్ను విరటుని • భవనమందు
నిత్యగౌరవ మొనఁగూర్చె • నృత్యవిద్య.

ఆ॥ వె॥ ఇతరగుణము లెన్ని•యేని యుండునుగాక
విద్యలేని జన్మ • వృథయ సుమ్ము !
చూడఁ గనులులేని•వా నితరాంగంబు
లెన్ని యుండుఁగాక • యేమి సొగసు ?

తే॥ గీ॥ అధమునందేని యుత్తమ•మైన విద్య
తనరుచుండిన దానిఁ గై•కొనఁగఁదగును,
అమలకాంచన మపవిత్ర • మైనచోటఁ
బడిన మాత్రాన నెవఁడైన • విడువఁగలఁడె ?

### వినయము

ఆ॥ వె॥ వినయగుణముతోడ ♦ వెలయుచుండెడి విద్య
ఘనవిచిత్రమును హ♦రింపకుండు
కాంచనంబు రత్న♦కలితంబు నైనచోఁ
గనులకుం బ్రమోద♦కరముగాదె!

ఆ॥ వె॥ వినయమొసఁగునట్టి ♦ విద్యయే యవినయ
హేతువైన నెవ్వఁ ♦ డేమి సేయుఁ
గంటిఱెప్పవోలెఁ ♦ గాపాడు తల్లియే
విషముఁ బెట్ట దిక్కు ♦ వేఱ గలదె?

### వివేకము

ఆ॥ వె॥ బుద్ధిశాలియైన ♦ పురుషుండు దుష్టుల
యుక్తిచేత గెల్చు♦చుండు నిజము
ప్రాని చెంత నున్న ♦ భూమిఁ ద్రివ్విన యంత
గొప్పవృక్షమైనఁ ♦ గూలిపడదె?

ఆ॥ వె॥ ఏస్థలంబునందు ♦ నేకార్య మొనరింప
నలయునో యెఱుంగ♦వలె నరుండు
నీటిమీఁద బండి ♦ నేలపైఁ బడవను
గడఁగి యెవ్వఁడైన ♦ నడుపఁగలఁడె?

ఆ॥ వె॥ ఆర్యజనులయందు ♦ నల్పవివేకియౌ
వాఁ డొకింత కీర్తి ♦ వడయుఁబోఁడు
సురుచిరంబు లైన ♦ సూర్యకాంతులమధ్య
దివ్వె సుంతయైన ♦ దీప్తిఁ గనునె?

ఆ॥ వె॥ సాంతమైన తెలివి ♦ సుంతయు లేనట్టి
వాని కేల శాస్త్ర♦సర్గ మెల్ల?
అంధుఁడైన వాని ♦ కద్దం బొసంగుట
వలనఁ గొంచెమైన ♦ ఫలము గలదె?

## ధైర్యము

తే॥ గీ॥ అందఱును బెద్దలే సౌఖ్య ♦ మనుభవింపఁ
గష్టములఁ బొంద ధీరుఁ డొ♦క్కఁడె తగును,
అమృతపానంబుఁ గావించి ♦ రమరులెల్ల
శంకరుఁడె గతి యయ్యె వి♦షంబు మ్రింగ.

తే॥ గీ॥ అధికకష్టంబులను గూర్చి♦యైన మాన్పఁ
దరము గా దల ధీరుని ♦ ధైర్యగుణము
చేరి యగ్నిని దలక్రిందుఁ ♦ జేయుచున్న
జ్వాల లూర్ధ్వముఖంబుగా ♦ సాగకున్నె?

తే॥ గీ॥ ఇలను బంధువియోగంబు ♦ గలిగినంత
ధైర్యగుణమును విడువంగఁ♦దగదు నరుఁడు
పుత్త్రమరణంబు విని ధైర్య♦మును త్యజించి
మున్ను ద్రోణుండు దా స్వర్గ♦మునకుఁ జనఁడె?

ఆ॥ వె॥ అమితకష్టకాల♦మందును ధైర్యంబు
వదల కున్న మేలు ♦ వడయఁగలరు
తెప్ప మునిఁగినంత ♦ ధీరుండు సంద్రంబు
నీది గట్టుఁజేర ♦ నెంచకున్నె?

## శౌర్యము

ఆ॥ వె॥ అల్పు లెంతమంది ♦ యైనను శూరుని
సంహరింపలేరు ♦ జగతియందు
అడవిలోని మృగము లన్ని ♦ యేకం బయ్యు
సింహమునకుఁ గీడు ♦ సేయఁగలవె?

ఆ॥ వె॥ తాను గూర్చినట్టి ♦ ద్రవ్యంబునే శూరుఁ
డనుభవించుఁ గోరఁ ♦ డన్యధనము
స్వీయముఁగా మదేభ♦సంహార మొనరించి
యశనంబు సేయు ♦ సింహ మెపుడు.

తే॥ గీ॥ ఘనతరం బగు తేజంబు ♦ గలిగియున్న
వయసుతోఁ బని లేదు త♦త్త్వంతయైన
అరయఁగా బాలసూర్యుని ♦ కిరణసమితి
పర్వతంబులమీఁదికిం ♦ బ్రాఁక కున్నె?

తే॥ గీ॥ శత్రుఁ డెంతటి భుజబల♦శాలియైన
శూరుఁ డాతని లెక్కఁగాఁ ♦ జూడఁబోఁడు
పర్వతము నెత్తుసం బేర్పఁ♦బడినయట్టి
కట్టెలను గాల్చదే నిప్పు♦కణిక యొకటి.

తే॥ గీ॥ అరయఁగా నెంతబలవంతు ♦ లైనఁగాని
శూరు నెదిరించి నిల్వఁగా ♦ లేరుసుమ్మ!
గర్వకలితంబు లగు మహా♦పర్వతములు
వజ్రమును గాంచుచోఁ దల♦వాల్ప కున్నె?

తే॥ గీ॥ శూరుఁడును శూరునే చంపఁ ♦ జూచు మగుడుఁ
గాని హీనుల వధియింపఁ ♦ బూనుకొనఁడు
కోరి సుడిగాలి చెట్లనే ♦ కూల్చుఁగాని
చిన్నగఱికల నశియింపఁ ♦ జేయు నొక్కొ!

తే॥ గీ॥ అవనియందున శూరుఁడై ♦ నట్టి నరుఁడు
వాని వీరి సహాయతఁ ♦ గోరఁబోఁడు,
సింహ మితరమృగంబుల ♦ చేత సాయ
మందఁగలఁచు నొక్కో స్వప్న ♦ మందునైన!

తే॥ గీ॥ క్షాంతిగలవాఁ డటంచుఁ దే ♦ జస్వి కెన్నఁ
డేనియుఁ బరాభవంబుఁ గా ♦ వింపరాదు
సారెసారెకు తఱచినఁ ♦ జందనమున
నైనఁ దప్పక జనియించు ♦ నగ్నికణము.

ఆ॥ వె॥ శౌర్యధనుఁడు లేని ♦ సమయంబునం దెల్ల
వారు శూరు లగుచుఁ ♦ బరగుచుందు,
భాస్కరుండు లేని ♦ పట్టున మిణ్గురు
పురుగుగూడఁ గాంతి ♦ నెరప కున్నె?

వీర్యము

తే॥ గీ॥ వీరవర్యుండు తననోరు ♦ విప్పినంత
నఖిలశత్రువులును భయ ♦ మందఁగలరు,
నెమలి యొక్కంతశబ్దంబు ♦ నెరపినంతఁ
బాములన్నియు భీతిచేఁ ♦ బర్వులిడవె?

తే॥ గీ॥ పేరుని ప్రతాప మొక్కింత ♦ వెలసినంత
నొక్కఁడును దేశమున శత్రు ♦ వుండఁబోఁడు
అబ్జబాంధవుఁ డుదయించి ♦ నంతమాత్ర
నంధకారంబు క్షణములో ♦ నడఁగిపోదె?

తే॥ గీ॥ పేరునకుఁ గష్ట మొకటఁ బ్రా ♦ పించుఁగాక
మరల నమితప్రతాపుఁడై ♦ పరఁగఁగలఁడు
ఇనుఁడు విధివశమున న ♦ స్తమించుఁగాక
తిరిగి యుదయింపఁడే దివ్య ♦ తేజ మలర?

తే॥ గీ॥ ఎంతపేరుఁడై నను విక్ర ♦ మింపకున్న
నాతనికి నొక్కఁడును భయ ♦ మందఁబోఁడు
ఇలను బెబ్బులియును బొబ్బ ♦ రింపకున్న
బాలకుల కాటవస్తువై ♦ పరఁగుఁగాదె!

## సామర్థ్యము

ఆ॥ వె॥ అధ్యుఁడైనవాని ♦ ననిశంబుఁ గాపాడ
వలయు నంశమెల్ల ♦ నిలచుకొనుటకు
బండికుండ మొకటి ♦ పాడైనఁ బోఁ జక్ర
మెట్లు తిరుగు నాకు ♦ లెన్ని యున్న?

ఆ॥ వె॥ ఆప్తుఁ డొకఁడు మరణ ♦ మందినంతనె పెక్కు
జనములకు విపత్తు ♦ సంభవించు
సూర్యుఁ డస్తమించు ♦ చో నెల్లపద్మముల్
ముడుచుకొనవె? నిండు ♦ ముదము వీడి.

ఆ॥ వె॥ ఎట్టిదుష్టజనుల ♦ నేని సమర్థులౌ
వారు క్షణములోన ♦ నంపఁగలరు
ఎల్లరకు భయంబు ♦ నొసఁగించు పామునే
కాలఁ జీల్చుకున్న ♦ గరుడపక్షి!

ఆ॥ వె॥ అధికశక్తివంతుఁ ♦ డైనను దనశక్తిఁ
దెలుపకున్నఁ గీర్తి ♦ కలుగఁబోదు,
కొయ్యయందు నగ్ని ♦ కూడియుండును గాక
దాని నెవ్వఁడైనఁ ♦ దలఁచు నొక్కొ!

తే॥ గీ॥ బలముగలవారి బాధింపఁ ♦ దలఁప రెవరు
ఎల్లరును సాధువులనె హిం ♦ సించుచుండ్రు
ఇల గజవ్యాఘ్రసింహాదు ♦ లెన్ని యున్నఁ
జంపుదురు మేఁకలనె యజ్ఞ ♦ సమయమందు.

తే॥ గీ॥ బలముగలవారలకు సాయ ♦ పడెడువారె
చేరి బలహీనులకుఁ గీడు ♦ సేయుచుండ్రు
చెలఁగి యగ్నిని వ్యాపింపఁ ♦ జేయునట్టి
వాయువే దీపముల నార్పి ♦ వేయుఁగాదె!

## పౌరుషము

తే॥ గీ॥ పౌరుషము గొంచెమును లేక ♦ పెరుగువాఁడు
అధములందును నవమాన ♦ మందఁగలఁడు
ఆలయముమీఁది రాతిసిం ♦ హమును జూచి
వాయసములును నెత్తిపై ♦ వ్రాలకున్నె?

తే॥ గీ॥ పౌరుషంబును విడనాడి ♦ పూరుషుండు
దైవమే యన్నిటికి నంచుఁ ♦ దలఁపఁదగదు,
ఒక్క చక్రంబుమాత్రమే ♦ యుండునేని
నడచునే బండి పుడమిపైఁ ♦ బడునుగాక!

తే॥ గీ॥ యత్నమునఁ గార్యసంసిద్ధి ♦ యగును గాని
మదిని దలపోయుచున్నంత ♦ మాత్ర నగునె?
కోరి సింహంబు గుహాలోనఁ ♦ గూరుచున్న
వనమృగంబులు నోటిలో ♦ వచ్చిపడునె?

శాంతము

తే॥ గీ॥ ఏపనియు నెమ్మదిగనె సా ♦ ధింపవలయుఁ
గాని వేగిరపడ మేలు ♦ గలుగఁబోదు
పూటపూటను నీరెం ♦ తపోయుచున్న
వృక్షము లకాలమున ఫలి ♦ యింపఁగలవె?

ఓర్పు

తే॥ గీ॥ విధివశముచే విపత్తు ప్రా ♦ ప్తించినపుడు
ఎట్టిఘనులైన నోర్పు వ ♦ హింపవలయు,
భవ్యతేజఃప్రభావులౌ ♦ పాండుసుతులు
హీనత విరాటుచెంత స ♦ హింప రొక్కొ!

తే॥ గీ॥ ఎట్టికష్టంబులైన స ♦ హించువాఁడె
యఖిలజనులందు గౌరవ ♦ మందఁగలఁడు
రత్నములు సానరాతి ఘ ♦ ర్షణము నొంది
మిగుల తేజంబుతో నెందు ♦ మెఱయుఁగాదె!

తే॥ గీ॥ అధికకష్టంబు లోర్చి వి♦ద్యాభిలాషి
గురువునకు సంతసంబుఁ జే♦కూర్పవలయు
శుక్రునకు భక్తితోడ శు♦శ్రూషఁజేయఁ
గచుఁడు సహియింపఁడే పెక్కు♦కష్టములను.

సత్యము

తే॥ గీ॥ ఎట్టిఘోరకష్టములు ప్రా♦ప్తించుఁగాక
వీసమంతయు సత్యంబు ♦ వీడరాదు
సత్యమును నిల్పుకొన హరి♦శ్చంద్రనృపతి
చేయఁడే మున్ను చండాల♦సేవనంబు?

తే॥ గీ॥ ధర నెవండైనఁ గార్యసా♦ధనముకొఱకుఁ
దప్పఁగా రాదు నిత్యస♦త్యవ్రతంబు.
దాని వదలుటచేతనే ♦ ధర్మరాజు
చూడవలసెను నరకసం♦క్షోభ మెల్ల.

ధర్మము

ఆ॥ వె॥ చదువుఁగాక సర్వ♦శాస్త్రముల్ ధర్మంబు
నాచరింపకున్న ♦ వ్యర్థమగును
ఔషధంపుసేవ ♦ నాచరింపక దాని
పేరుఁ జెప్ప వ్యాధి ♦ వీడునొక్కొ!

తే॥ గీ॥ తల్లిదండ్రుల కెపుడు మో♦దంబుఁ గూర్ప
వలయుఁ గోపంబుఁ గల్గింపఁ ♦ దలఁపరాదు
పాములన్నియుఁ దల్లికో♦పంబువలనఁ
గాలిపోయెను సర్పయా♦గంబునందు.

తే॥ గీ॥ ఎన్నఁడును బెద్దలఁ దిరస్క•రింపరాదు
వారిశాపంబుఁ దప్పింప • వశముగాదు,
అట్టిశాపంబె ప్రాప్తించి • నందువలన
నలఁ బరీక్షిత్తు నాశంబు • నంద లేదె!

తే॥ గీ॥ ఆర్యుల హితోపదేశంబు • నవలఁ దోసి
సంచరించిన నాపదల్ • సంభవించు
విదురముఖ్యుల వాక్యముల్ • వినని కతన
నెల్ల కౌరవులును నశ•యింపలేదె?

భక్తి

ఆ॥ వె॥ ఎన్ని సంకటంబు•లేని కల్గునుగాక
యెపుడు నీశ్వరుని స్మ•రింపవలయు
అంపశయ్య నున్న • యపుడును భీష్ముండు
తనివిదీరఁ గృష్ణుఁ • దలఁపలేదె?

తే॥ గీ॥ ఘనతరం బగు శివభక్తి • గలిగియున్న
మృత్యువునుగూడ నరులు జ•యింపఁగలరు
కాంక్షతో శంభుఁ గొలుచు మృ•కండుసుతుని
మరణమొందింప యముఁడ స•మర్థుఁ డయ్యె.

తే॥ గీ॥ వసుధయం దెవ్వఁడేని గ•ర్వము వహించి
యెన్నఁడును దేవుని నిరాక•రింపరాదు,
రాక్షసేశ్వరుఁడైన హి•రణ్యకశిపు
సంహరించెను హరి తిర•స్కారవశత.

